ప్రథమ ముద్రణ 1000 ప్రతులు

క్రోధినామ సం॥ర జ్యేష్ఠ శుద్ధ షష్ఠి సోమవాసరమున (జూన్–17–1964)
జరిగిన మా పెద్దన్నయ్య శ్రీ నాళం రాజారావుగారి షష్ట్యబ్దపూర్తి
శుభ మహోత్సవ సమయమున

# నొసంగిన కృతి

# అంకితము

## (నాళము కామరాజస్తుతి)

నాళము వంశ సంభవుడు నాణెపు ధార్మికరీతి నీతికిన్
నాలమె నాళమన్ ప్రథితి నాలుగు దిక్కుల వ్యాప్తినొందగా
మేలగు సత్రనిర్మితిని మించినసత్కృతి; మాదుతాత, ధీ
శాలిని కామరాజసుధి సంస్తుతి సేసెద వంశవృద్ధికై.

శత్రువునైన సత్కృతిని సాధువు చేయగగల్గు పాటవం,
బాత్రములేని బుద్ధియును, నార్జవమున్, వ్యవహారదక్షతల్
పాత్రత తోడిదాతృతయు, భావవిశుద్ధియు గల్గుధీర చా
రిత్రుని రాజరాయసుధి శ్రీపతి బ్రోచును వేంకటేశుడున్.

పిన్నవయసుననుండి నన్ ప్రేమజూచె
మహిత సుశ్లోకుడగుచు సమానులందు
ప్రథిత నాళమువంశ గౌరవము పెంచె
అతడు మాయన్న తత్త్వ విద్యారతుండు.

శాంతధీశాలి కతిధృతి మంతుసకును
అమృత తత్త్వ విజ్ఞాతలౌ ఆత్మవిమల
అనుభవ సదుక్తిమంజరినమలకృతిని
అంకితముసేతు లోకహితానురక్తి.

"సర్వేజనాస్సుఖినోభవంతు"

ఓం తత్సత్.

# దివ్యాలోకం

క్లేశబహుళమూ, దుఃఖతప్తమూ, అజ్ఞానాంధమూ అయిన మానవాళికి వెలుగునిచ్చి, సంతృప్తిని కల్గించి, శాంతిని ప్రసాదించేవి మహా పురుషుల దివ్యబోధలే.

నాలాయేండ్ల క్రిందటి సంఘటనఇది: సుమారు పది పదేనేండ్ల క్రితం మా చిరంజీవులను హిందీ రాష్ట్రభాష పరీక్షకు కొంచెం శ్రద్ధగా చదివిస్తూ ఉన్న రోజులవి. ఆ సమయంలో వారి పాఠ్య గ్రంథాలలోఉన్న కబీరు. తులసీదాసు మున్నగు సాధు పురుషుల 'సంత్' (సాధు) కవితను పరిశీలించడం తటస్థించింది. ధార్మిక పరతంత్రమైన పూర్వ భారతావనిలో మానవ సంఘానికి సందేశమిచ్చే కావ్యపరంపరలు చైతన్య స్రవంతులుగా అన్ని భాషలలోనూ ధారా ప్రవాహములుగా వెలువడియుండడం అందరెఱింగిన విషయమే.

ఆ శ్రేణిలోనివైన ఆ దోహాలు ఆ నాడు నాలో ఉన్న ఒకవిధమైన ఆర్తిని సమయింప జేసి నాకు తృప్తినీ, శాంతినీ కల్గించడమేకాక, నా హృదయంలో ఒక దివ్యలోకాన్ని ప్రసరింపజేశాయి: భంగ్యంతరంలో చెప్పాలంటే, ఆ సంఘటన నా హృదయంలో చెఱగనిముద్ర వెయ్యడమేకాక, నాకు చైతన్యంతోకూడిన సంస్కారాన్ని ప్రసాదించడానికి కారణమయిందనికూడా చెప్పాలి.

అందువలన నేను ఆ దోహాలచే ఆకర్షింపబడి ఆ ద్విపదలను పదే పదే మననం చెయ్యడమూ, అట్లా మననం చేసిన ప్రతిసారీ ఆ దోహా (ద్విపద) లనుండి క్రొత్త క్రొత్త అర్థాలూ, భావాలూ తోచి నాకు ఏదో ఒక సరిక్రొత్త లోకం ఆ దివ్యాలోకంలోనుంచి తొంగిచూస్తూ దర్శనమిచ్చి అనిర్వచనీయమైన ఆనందం ఉత్పన్నం కావడమూ తటస్థించింది. అది మొదలు హిందీ సాహిత్యంలోని అట్టి రచనలకొఱకు భక్త్యుత్కంఠలతో అన్వేషణ చేశాను. ఆ అన్వేషణ ఫలించినకొలదీ నాకు ఆ రచనలపై, ఆ మహానుభావులపై గొప్పభక్తి గౌరవాలు ఏర్పడ్డాయి. వానికి తోడు ఆ సాధు పురుషులు ఆ రచనలలో ప్రదర్శించిన సంగ్రహిత, సంయమనము, దివ్యశక్తి సమన్వితమైన ఆత్మైతనుండి ఉట్టిపడే సముజ్జ్వల భావ సౌందర్యమూ నన్ను పరవశురాలిని చేశాయి.

ఆ పరవశభావం నన్నెంతవరకూ తీసికొని వెళ్ళిందంటే, ఆ దోహాలను తెలుగు చేసేంతవఱకు స్వస్థత చేకూరని ఆయోమయ పరిస్థితి కలిగేంతవఱకు దారితీసింది. ఆ ప్రేరణతో అప్పట్లో వ్రాసినవే ఈ సదుక్తి మంజరి లోని వివిధ పద్యకుసుమాలు !

హిందీ సాహిత్యంలోని ఈ భక్తి ప్రాంగణంలో కబీరు, తులసీదాసు, బృంద, రహీములవంటి పరార్థజీవన ప్రభువతంసులు గళమెత్తి పాడిన మనోహర గీతికల నంతంగా ఉన్నవి. ఆ మహామధుర దివ్యతరంగిణులనుండి నేను గ్రోలగల్గినది ఒక పురిసెడుకూడా లేదు. ఇవి నా అజ్ఞాన పరిమితికి ఇయత్తా చిహ్నాలు.

కలుష భావ ప్రేరణతో, స్వార్థ పంకిలమున చిక్కుకొని దరిగానక, ఊపిరి సలుపక ఉక్కిరి బిక్కిరి యగు మానవ లోకమునకు వినిర్మల జీవితానంద సౌఖ్యగతిని ప్రసాదించుటకే కబీరు, తులసీదాసు,

వేమన, లల్ల. లిక్కి. మహాదేవి, మీరా, వేంగమాంబలను బోలు మహాను
భావులు, మహాయోగినులు కారణ జన్మతో భువి నవతరించి యుండిరి.
ధర్మాభ్యుత్థానమునకై భగవానుడు కరుణతో సంకల్పించిన అవతార
ప్రయోజనము ఈ దివ్య ప్రకృతుల, పవిత్ర జీవనముచేతను. పావన
సందేశములచేతను కొంత కొంత నెఱవేరుచునేయున్నది.

స్వార్థమును త్యజించి.తమతోటి సోదర మానవులకు నిరుపద్రవ
మగు కళ్యాణ స్థితిని అనుగ్రహించుటే వ్రతముగా జీవనము గడపిన
వీరి పవిత్ర సందేశములు వాగ్రూపము వహించి, మంగళ గంగా తరంగి
ణులై భారతీయ సాహితీ భువనములలో ప్రవహించినవి. ఈ యమృతంపు
టేరులు, ఈ అదభ్ర శుభ్ర మందాకినీ శ్రేయః ప్రవాహములు తమయం
దవగాహ మొనర్చిన దుఃఖ తప్తులకు, ఆర్తి బాధితులకు ఆత్మశాంతినీ,
అమృతత్వమునూ ప్రసాదించినవి.

ఆ పవిత్ర సందేశములు మనకెల్ల యపుడును సమ్మాన్యములే
శిరోధార్యములే అగుట ఆవిశుద్ధ తపస్వుల బోధామృతమును గ్రోలి నేను
చిత్తోపరతిని బడసినయట్లే ఇంక కొందఱును ఉపరతిని, చిత్తస్వాస్థ్య
మును పొంది తరించుట కవకాశముండునను ఉద్దేశముతో ఆనాటి ఈ
రచనలను ముద్రిణ చేయించవలెనని ప్రయత్నపడితిని. అంతేకాని
యీ నా రచనము సర్వాంగ సుందరమైనదను భావము నా కెన్నడును లేదు,
అయితే మాన్యులు. సోదరులు శ్రీ దొడ్డు పాపిరాజుగారి ఆశీర్వాదముతో
ఈ రచనకు కొంత సౌందర్యాకృతిని పరిష్కరించవలెనని పేరాసపడితిని.
అట్టిదేదైన ఈ రచనమున గన్పడినచో అది మా అన్నగారి ఆశీర్వాదమే.

మొదట మొదట ఈ పద్యములను కొన్ని ఆంధ్రమహిళ.
గృహలక్ష్మి పత్రికలలో పెద్దలసుద్ది. పలుకుబాట అను మకుటములతో

ప్రచురించితిని. కాని తరువాత మరి కొన్ని అనువదించి ఇప్పుడే కావ్యముగా సమర్పించుకొనుచున్నాను. ఈ నా అనువాదము కేవలము భావానువాద శ్రేణికి చెందిన స్వేచ్ఛానువాదము మాత్రమే.

ఈ ప్రయత్నం ఈ విధంగా సాగుతూఉండగా 64 జూనులో రాజమహేంద్రవరంలో మా పెదనాన్నగారి కుమారుడు శ్రీ నాళం రాజారావన్నయ్యకు షష్ట్యబ్ది పూర్త్యుత్సవం జరిగింది.

మా అన్న మిక్కిలి తత్త్వచింతాపరుడు, పరోపకారి, సాధుశీలి, విశేషించి చిన్ననాటినుండి నన్ను పరమ ప్రేమాదరములతో సంభావన సేయువాడు. మా అన్న నాయెడ గనబరచు వాత్సల్యానురాగముల శాశ్వతస్మృతికై ఆత్మవిదుల అనుభవతత్త్వ ప్రతిపాదకమైన ఈ కావ్యమును ఆదరముతో అన్నకు కృతి నీయవలెనని ఉబలాటపడితిని. నా యీ కోర్కెను మన్నించి పరమాదరముతో కృతిని స్వీకరించిన మా పెద్దన్నయ్యకు నా ధన్యవాదములు.

అప్పుడప్పుడు తమ పత్రికలలో ప్రచురించిన ఆంధ్రమహిళ, గృహలక్ష్మి పత్రికాధిపతులకు నా కృతజ్ఞతా వందనములు.

భావపురి
4-3-67

ఊ. లక్ష్మీకాన్తమ్మ

# సదుక్తిమంజరి

## కబీరువాణి

ధరణి సర్వమ్ము నొక్క పత్రమ్ము జేసి
వృక్షవితతికి లేఖినీవిభవమొసగి
ఏడు సంద్రాల వెస సిరా ఏర్పరించి
శ్రీహరిగుణముల వ్రాయ నప్రతిభుడైతి. 1

మలిన మగుచు కేలను జపమాల తిరుగు
నోట నాలుక తిరుగును నూరుగతుల
తిరుగు చిత్తమ్ము నాలుగుదిశల పట్టి
జపము మాత్రమె రవ్వంత జరుగబోదు. 2

ఒక్కశబ్దము సుఖముల కిక్క యగును
ఒక్కశబ్దము దుఃఖాల కిక్క యగును
ఒకట బంధము, గొంతుక కురియు నగును
ఒక్కటను మాత్రమె సమత నొందగలము. 3

ఒరుల కుశలమ్ము ప్రశ్నింత్రు నరులు వెఱ్ఱి!
తమ యునికి సుంత తెలియరు ధరణిపైని
జరయు పైకొను, నుడుగదు మరణ భయము
నేమ మింకేలరిత్త యాశింతు నరుడ। 4

ఈవు నాకొఱకేడ్తు విందెవరు తిరము !
ఏనొక దినాన నీకొఱకేడ్తు నేమొ !
ముందువెనుకగ నొకనాటి కందఱమును
ఎచటికో, ఇటనుండియు నేగవలదె?  5

"ముందుసంగతి కాన, వేమందునోయి,
కుమ్మరీ, నన్ను కాళ్ళ ద్రొక్కెదవు నేడు
నిను నలగద్రొక్కు రోజు వచ్చును నిజమ్ము"
అంచు మృత్తిక పల్కు నాలించుమోయి.  6

అహహ ! ఒకతలకల్గు మానవుడు కూడ
హెచ్చుగా గర్వపడు టది యెంతవింత !
పదితలలతోడ, కరము లిర్వదియుగల్గు
రావణుండె ధరిత్రిని రాలెతుదకు.  7

పనికి నేతెంచి మాలి యేదినము నందు
ముంచి వికసించు సుమముల నెంచిత్రుంచు
"రేపు మనవంతు! బ్రదుకింతెలే"యటంచు
కుందు వనిలోని చిన్నారికుట్మలములు,  8

ప్రేమమార్గము సుగమమ్ము విదితమిదియు
వక్రగతిపోచు దానినే వక్రమనకు
"ప్రతిభచాలక వేదిక వక్ర"మనెడు
నాట్యకత్తియ తెలివికి నవ్విపోరె?  9

చిన్నిగింజను కొనియేగు చీమయొకటి
మార్గమున వేప గింజకై మనసుపడియె
ఏదియొ యొకండె దక్కును నింతెకాని
చిన్నినోటికి రెండెట్లు చిక్కగలవు ! 10

స్వామి, నిత్యమ్ము నినుగొల్చు ఫలమిదానె?
సుతులు, నిల్లాలు నాకట సోలుచుండి
రేపు దిననింత, సాధులకింత నిడగ
పిడికెడో గిరమిడు మది వేలుసేయు. 11

సాధుజనమ్ము ప్రశ్నింప జనదు సుమ్ము
జ్ఞాన పరిమితి నెంచుటే న్యాయమెపుడు
పదునెఱిగి కత్తి విలువ కట్టదగుగాక
ఒరపసందునకై ధర నుంచదగునె? 12

మంచితనమును పల్మాఱు కించపఱచి
ఎంచి చెడుగునె కైకొందు రేల నరులు?
వెసగునానుగ ఎప్పుడు పిప్పినె గ్రహించి.
స్వాదు రసమావలకు ద్రోచునరణిగాదె. 13

కుసుమగర్భాన సౌరభ మెసగినట్లు
నీదు హృదయమునను స్వామి నిండియుండె
నాభిగల గంధ మెఱుగమి నడవియెల్ల
వెదకు మృగమట్లు యీశ్వరు వెదకెదేల? 14

హంసయు బకమ్ము మానసహ్రదము నందు
నొక్కరీతిగ నివసించుచున్న నేమి?
హంస గ్రహియించు ముత్యము లాహారముగను
కొంగ పొంచుండి చేపల కొనరి తినును. 15

దురభిమానమ్ము మదినుండి దొలగద్రోచి
సతము నోరుమది, దనమది, జల్లపఱచు
పథ్యవచనమ్ము పలుకంగ వలయు నెపుడు
పెరటి మధువాడిపిన తేనె పెరలెకాదె? 16

అదిర: పుడిసెడు నీరు పుట్టదట తనకు :
పసులకీగలడంట ! తాఁ బాలకడప
తనమనసు నిల్పగాలేక వనట గుండు
పసుల తరియించవేయ, దంబములుపలుకు. 17

పాలసమ్మంగ తిరుగగా వలయు వాడ
పుర గొన నదుండు తానుగా దిరుగుచూత
పొట్లుపడిన బుతము చెల్లుబడియెకాదు
చెల్లు నస్మృతమ్ము శ్రమమింత చెందకుంత. 18

యోజనంబుల దూరమందున్న, సఖుని
హృదయసన్నిధి నున్నట్లె యెంచజనును,
కపటి, ప్రాంగణ మందున్నగాని, వాని
కడలి కావలనున్నట్లె గాంచవలయు. 19

కుజనసంఘమ్ము నందలి సుజనుబోధ
కదలియుప్పైన మధురాంబుకణము బోలు
శిష్టమైత్రి జెఱచు నొక్కచెడుగుమాట
ఉరక పాలను విరువదే ఉప్పుగల్లు. 20

వెఱ్ఱి హృదయమా! త్వరయేల వినుమొకింత
అదనునన్ దప్ప కార్యమ్ము కుదురువడదు
కోడిపోసిన నీరెంత తోటమాలి
ఋతువురాక ఫలించునే వృక్షతతి. 21

కాంతి నొకకొంత బోలిన గాజుపూస,
ఎంతు వజ్రమ్ము ననియేల మిడిసిపడెదు?
మణిని గైకొను క్రయవేళ మన్ననమెయి
నిన్ను వ్యాపారి చులకగ నేలవిడుచు. 22

చిన్నవారి మన్నించుచు సేగిపనుల
దొడ్డవారి మేల్చేతల స్తుతియొనర్చి
సమితమిరగ వర్తింప జాలవేని
బ్రతుకు వృథయౌను తలపుమో వయసుకాడ. 23

చావు పొసగిన నొకమారె చావవలయు
జన్మబంధమ్ము తెగిపడు సరణి మెఱయు
అస్వ్య లవమతి నల్ప జఘన్యవృత్తి
వేయిమార్లు చత్తువేమోయి నరుడ! 24

దైవమెవ్వాని రక్షించు దయ యొసంగ
వాని హింసింప జాల రెవ్వారలైన
జగతి యేకమై జతనమ్ము సల్పుగాక
ఇదియసూ దైవబల. మెందు నెదుఱుగలదె, 25

తమ ఫలమ్ముల దినవు భూజముల గములు
తమ జలమ్ముల గొనవు నదమ్ము లెప్పుడు
తమ వెలుంగుల గనవుబో తారకాళి
సాధుజనభాగ్యము పరార్థసాధకమ్ము. 26

ముండ్లనొసగిన వారికి పండ్లనిమ్ము
పండ్ల నిడినను మఱి వారుముండ్లె ఇడిన
సహనమున్ జూపు; దైవమ్ము సాయపడుచు
ముండ్లశూలమునను వారి పుడమిగూల్చు. 27

నీటి లోతులు మునిగిననె, తెలియనగు
తీరముననుండువారికి తెలియునెట్లు?
కష్టసుఖములు వ్యవహార కర్తయె యెఱుగు
వదరుబోతులేరీతిగ పలుకనేమి? 28

ఏది నీకు ప్రాప్తించునో దాని సకమె
ఎంతురొట్టైనెన భుజించి తృప్తిపడుము
ఉన్నదానికి తృప్తిలేకున్న, అదియు
దక్కకయె పోవు; తెలియు మీ ధర్మగతిని. 29

మంచి దినములు ముందె గతించి పోయె
అప్పుడు హరినామ మొనరింప ననువుపడదొ?
ఇప్పుడు పరితాప మేటికి? ఇంతచేను
పక్షులవితినె; మేల్కొన్న ఫలము కలదె? 30

కష్టమెంతైన, మఱి మఱి నష్టమైన
వెఱపువీడి నీటమునిగి వెదకికొన్న
లోతు నీటను లభియించు జాతిమణులు
గట్టుననె యున్న ఫలమెట్లుకలుగు చెప్పుమ. 31

స్వామి! నిన్ను ప్రేమించెడు భక్తకోటి
కోట్ల సంఖ్యను కలరు నాబోంట్లు నీకు
అయినగాని నన్ మఱువకు మయ్య నీవు!
ఎవరు నినుబోలువారు నాకింక లేరు. 32

యాచనంబది కడునీచ మరయవేమి?
అంతకంటెను మఱిచచ్చు టదియె మేలు
అడుగుకొను కొలందియు బ్రదుకడుగునటుడు
గురుల యుపదేశ మిది నీవు మఱువజనదు. 33

# తులసిపలుకు

రాముడుండు నెడల కాముండు గదియుంపు
కాముడుండకున్న రాముడుండు
రవియు చంద్రముండు రాజిల్లవొక్కచో
తులసి పలుకుబాట తెలిసి చనుము. 34

ఎన్నొ యేండ్లు బ్రదికి యెన్నొబోధలుజేసి
పిన్న వారి నుంత ప్రేమగనరు
ఏమి ఫలమొ తులసి యెఱిగింపవే వెన
ఒఱ్ఱి పుచ్చకాయ ఉనికిగాక. 35

* సంఘసేవయంచు సంస్కారమంచును
ఐకమత్యమంచు అఱచువారు
ఒరులపచ్చ జూచి యోర్వనే జాలరే
తులసి వీరికింత తెలుపగదవె.

విదితసత్యవాక్కు విమలమౌ చిత్తమ్ము
కపటరహితవృత్తి గలుగు సుజను
మోహపుప్పుగలరె పుష్కరకలితైన
తులసిపలుకు బాట తెలిసిచనిన॥ 37

బంధువెందఱున్న బంధమునకెగాని
సత్యపదవికౌఱకు సాయపడరు
రాముకృపయె నీకు రక్షయౌనంచును
తులసిపలుకు; నిదియు తెలిసి చనుము॥ 38

---

స్వాంతరచన

ఆలు, బిడ్డలు, సిరి, యన్నవస్త్రములును
పాపియింటనేని బడయవచ్చు
సాధు సంగమంబు, చక్రికారుణ్యంబు
దుర్లభములు నెందు తులసి వినుము॥ 39

పరుల కొఱకె పూచి ఫలియించు సతతమ్ము
సాధుజనరసాలసాల మవని
పన్నిదాళ్ళగొట్ట నన్ని పండ్లొసగును
తులసిపలుకు దీని తెలిసి చనుము॥ 40

లోన, బయట, వెలుగు లోలి, వాంఛించుచో
రామనామ మనెడు రత్నదీప
శిఖను బదిల పఱపు జిహ్వాగ్రగేహాళి
తులసి పలుకు సరణి దెలిసికొనుచు॥ 41

సాధు జనుల, సురల బాధల బాపగా
మనుజ తనువుదాల్చి మహితవృత్తి
తాను వెతల బడిన దైవమ్ము రాముండు
కలిని పాపమార్చు తులసి వినుము॥ 42

దప్పిగొనియు దిటవు తప్పనివానికి
జలద మొకడె యొసగ జాలు తృప్తి
మానియైన భక్తు మానసార్తి నడంప
చాలరొరులు పరుడు స్వామి దక్క॥ 43

జలము ద్రచ్చి వెన్న వెలయింపగావచ్చు
పిండవచ్చు నినుమునుంచి నూనె
రామభజనలేక రాము పాటగలేము
తులసి పలుకుబాట తెలిసి చనుము॥ 44

పుడమి, వేష, భాష పొలుపొందు పనులలో
హాని కలిగితీరు నంతమందు
చిత్తశుద్ధితోడ జేయు కార్యమ్ముల
హానిలేదు: హరి సహాయ మొదవు॥ 45

సకలజగము కోరు సుఖమైన బ్రదుకునే
ప్రభుని కరుణలేక పడయరాదు
"ధనికి సుఖము కొల్ల" అని తలంచెడువారి
తులసి అజ్ఞులనుచు పలికె వినుము॥ 46

చెఱువునీటినెల్ల చేపలే త్రాగిన
వాని బ్రదుకె బయటపడునుగాదె
కొంగ తినునటంచు కొందల పడనేల
తులసి పలుకు బాట తెలిసి చనుము॥ 47

శిష్యరోగి, లోభి. దీక్ష వచస్కుని
అచిర కోపశీలు, నధికలోలు
ప్రాణమిత్రుడైన, వాని సంగాతమ్ము
విషమమంచు తులసి వెలయ బలికె॥ 48

పసులకీర్తి మాపి ప్రాభవమ్మున దన
పేరు పెంపుసేయ గోరునెడల
మొదలికీర్తి మాయు నదిగాక చచ్చినన్
మాసి పోవనట్టి మచ్చ మిగులు. 49

అచి పట్టకున్న నాకాశమంటెడు
గాలిపటము బోలె ఖలుల ప్రకృతి
అల్పమతుల నెప్పుడణచి యుంచుట మేలు
చనువుజూప చెడును వినుమతులస. 50

మనసు క్లేశముడిపి మాయించి చరితమ్ము
రక్ష యిడెడువాడు రాముడొకడె
కాక పరులవేడ గల్గునటేశాంతిః
వినవె తులసిపలుకు వెఱ్ఱిమనసః 51

సజ్జనుండు మొనసి సత్కార్మగావించు
మర్దనుండుసేయు దుష్కృతమ్ము
అమృత సేవనంబు అమరత్వముఘటించు
గరళయశము ప్రాణహరణమందె. 52

చూచు విషముపోల్కి సుజనుడమృతమును
బుతము నెంచు విషమురీతి ఖలుడు
అతిపవిత్రుడైన అగ్నిదేవు, జలము
లంటగలవె తులసి ఆలకింపు. 53

ప్రాప్త కంటకుండ పూచెనె గొనుచేటి
కోరి ఫలమునె తిను కోలువక్షి
మనుజ కుజనరీతి సొరిది నిట్లుండురా
తులసిపలుకు మాట తెలిసికొనుము. 54

చెత్తపనులె మొనసి చేయువాడెప్పుడు
మనము చెడ్డదన్న దలపలేడు
పందికాదె తినెడు బలుడుగు; దుర్గంధమ్ము
తెలియజాలదనుచు తులసిపలుకు. 55

పెల్ల యంగకముల నేకరీతిని దన్ను
బ్రహ్మ; అటుల నింట జిన్న పెద్ద
పరయవలయు సమత, యజమాని యనిమెను
తులసిపలుకు నెప్డు తెలిసికొనుము. 56

సలలితగుణదోష సంకులమౌ సృష్టి
చెడుగు విడిచి మంచి చేకొనదగు
నీర ముజ్జగించి క్షీరమ్ము గొను హంస
తులసి పలుకు సరణి తెలిసి కొనవె? 57

క్రొల్లపనము రోసి బవరమ్మునను జోడు
ఒక్కడంచు నెదిరి శౌర్య మెనయ..
పిరికి, కిష్టులు దాయ భీరమ్ము లేపల్కు
తులసి పలుకు సరణి తెలిసి వినుము. 58

జలద మఖిలతాపశమనాప్తి వర్షించు
ఒక్క జొన్న పంట కున్ననేమి?
స్వామి సకలసృష్టి, సత్కృప వీక్షించు
కొలుప కున్ననేమి ఖలు డొకండు. 59

పరుల పచ్చ జూచి భగ్గున మండును
నిప్పు లేని మంట నీచ జనుడు
పరపరోపకారభాగ్యదూరుని గాగ
తలప వలదె వాని తులసి తెలియ. 60

ఎవరికనుల హర్ష మెలయదో నినుజూడ
ఎచట గౌరవమ్ము నెసగ దచట
కాలు పెట్ట జనదు కనకమ్ము గురిసిన
తులసి పలుకు బాట తెలిసి చనుము. 61

తనకు మేలు కూర్చు పనులొనరించుచు
తనను దానె సుకృతి యనుటజనునె?
ఒరుల కెపుడు మేలు నొనగూర్ప నన్యులు
సుజను డనగ జెల్లు చూపె తులసి! 62

మనసు వికృతి మునిగి మాయల బన్నంగ
శిరసు ముండనమ్ము సేయ నేల?
అతులసుఖము గోరి యతివి కాగోరెదో
తలపు గమిని గోసి మెలగు తులసి. 63

హఠము పెంచు కొలది హఠమె పెంపగు గాని
తరుగ దింత: విడుము దాని పూన్కి
అసలె బరువు గోనె, అదినీట తడసిన
పెరుగు గాని బరువు తరుగ బోదు. 64

# రహీము సూక్తి

అడిగి, యభిమానహీనత నమృతమైన
బడయ జూచుట యననెంతొ బడుగుతనము
ప్రేమ నిచ్చిన గైకొంచు విషమునైన
మృతిని జెందుటె మఱియెంతొ మేలు సుమ్మి.                65

ఉసిరికను గోసి కారమ్ము నుప్పు రాయు
నట్లు, కటువచనము పల్కునట్టి జనుని
నర్మ శిక్షకు పాల్జేయ నగును గాని
విడిచి పుచ్చంగ సంఘమ్ము పిచ్చటిలును.                66

అడుగ నొడబడు నట్టి వాడగును మృతుడు
అడుగ బడియును ధర్మమ్ము విడినిగనక
యెవడు దానమ్ము సల్పంగ నిలను బూన
దతడు తలపంగ తత్పూర్వమృతుడు సుమ్ము.                67

ఓర్పు జూపుట పెద్దల కోజమిడును
కొంటె పనిచేత పిన్నల దంటతనము
భృగువు హరివక్షమును దన్నె బిగువు చూపి
హరి కలంకారమై యది మురుపు గూర్చె,                68

ఒకటి సాధింప సకలమ్ము నొనరుచుంత,
అన్ని సాధించుటయు వృధ యగును గాదె
మూలమును దడుపగ ఫలపుష్పవితతి
మనకు లభియించు నద్దాన మాన్యతముడ. 69

నీచమనుజునితో జేయు స్నేహ మైన
వైరమైనను హానికే దారితీయు
కుక్క నాకిన, కఱచినం గూడ మనకు
నెప్పుడు విపరీత మనుచు రహీముపలుకు. 70

పెరుగు మథియింప బడియును వెన్ననిచ్చు
చాల కష్టముల్ బొందియు నరకు గొనక
ఆపదల యందు మిత్రుడే యాదుకొనును
అవను తప్పించి పదులు నోనాడు చంద్రు. 71

పేదవారికి సాయమ్ము భేద మనక
కోరి యొనరించు వారె యుదారు లవని
కృష్ణు డపుడు కుచేలుని లేబరమ్ము
నరసి నరసి సాయపడలేదె జనులు మెచ్చ. 72

పేదవాడైన ధనియైన పెద్దయైన
తియ్యనౌ నీట దప్పిని దీర్చుకొనును
జలధి తానెంత ఘనమైన వలిత మేమి
తీర్చ గలదవే దాహముం దెలియుమయ్య. 73

# బృందహితవచం

ఆశ దిను కాకి వేపపం డాదరమున
కోకిలము మావి చిగురును గోరి తినును
ఎవరి సహజధర్మ మెదియొ యెవరి కేది
యిష్టమో యందె యత్నింప బృంద వలయు. 74

ఘనము తోడుత దాతృత్వ మెనయగల్గు
వాని, నాశ్రయించిన గొంత ఫలము కలుగు
జలములే లేనికడు పెద్ద సరసు నాశ్ర
యింప దాహమ్ము దీరునే యెందు బృంద? 75

అదనునం జేయు నుపకృతి యవసరపడు
అదను తీరిన యుపకృతి కంద మేమి?
ఎండి పోయిన చేలపై నిండి కురియు
వృష్టిచే లాభమెటుగల్గు నష్టిగాక! 76

తెలిసి గమ్యమ్ము యానమ్ము సలుపవలయు
స్థల పరిమితి నెఱింగి కాల్సాచవలయు
కాల మెఱిగియె చంద్రుండు గగనవీధి
తన ప్రయాణమ్ము సాగించు ఘనత బృంద 77

చెట్టుచేసి తా మంచి నాశించుగాక
మంచి యెట్టుల కల్గును? మంచి తలప
తాను జిల్లేడుగింజను ధరణి నాటి
ఆమ్ర ఫలముల నాశింప నగునె బృంద. 78

కటుకషాయములను ద్రావ కగపు సేయ
విషమరోగమ్ము తీరునే వెఱ్ఱిమనస
గురుని శిక్షతో గాకున్న కుదురుపడునె
హృదయమందున నుపదేశ మెదియు బృంద, 79

పెదవి తెఱువనంతవఱకు మదిని దాగు
మంచి చెడ్డల నెఱుగంగ మనకు వశమె
కాక పికముల వేర్వేయగలమె మనము,
అవి వసంతాన నోర్విప్పు నంతదాక! 80

మంచి చెడుగు లోకేరీతి మాన్య మౌచు
నెంచ బడునెట అచట వసింపవలయు.
ఉప్పు కప్పుర మేపురి నొక్కరీతి
తలపబడు దాని వీడగ వలయు బృంద. 81

రమ్యరసభావపూర్ణమౌ గ్రంథమైన
మూర్ఖు కరమున నదియెంతొ మోఘమగును
దివ్యతేజమ్ము గురిసెడు దివ్వెయైన
అంధునకు నదియెంతొ యనవసరమగు. 82

మధురవచనమ్ముచే నభిమానధనుడు,<br>
మత్తముండగు నటుగర్వ ముడుగు గాదె<br>
శీతజలయోగసంగతి శీర్ణమగుచు<br>
పాలు శాంతించునేగద పాలపొంగు. 83

సాయపడు: శక్తియుతునకే సర్వజగతి:<br>
శక్తిహీనున కెవ్వరు సాయపడరు<br>
వాయు వగ్నికి తోడ్పడి వంతపాడు<br>
దీపశిఖ నార్పివేయదే తెలియు బృంద. 84

క్రోధ ముద్రేకవచనాల కొంచె మగునె?<br>
మఱియు నొక్కింత క్రోధమ్ము పెరుగు గాని<br>
అగ్ని ఇంధనములచేత నంత పెరుగు<br>
కాని తరుగునె యిసుమంత గనగ బృంద. 85

# ప్రణయరీతి

* "అలుగు మొనమైన నాట్యమ్ము సలుపవచ్చు
ఒడిసి పులిమీస బుస్యూల లాగవచ్చు
ప్రణయగంభీరత నెఱుంగ వశమె" యనుచు
ప్రస్తుతించెద రార్యులు ప్రణయ మహిమ. 86

ప్రీతి గురువులు బోధింప లేని విద్య
గ్రంథముల కందనట్టి సౌఖ్యానుభవము
ప్రణయ భావమ్మునన్ బరస్పరము తెలియు
మధురతరజీవితానంద మమర మగుచు. 87

• మనసు మనసున పెనవైచు మంత్రశక్తి
పలుకు పలుకున నలవర్చు భవ్యమహిమ
తనువు తనువున దరిజేర్చు తనువు వింత
క్రియకు క్రియకును గదియించు క్రీడనమ్ము. 88

• తలపు తలపున ముడివైచు పద్మరజ్జు
వమలచరిత్రమ్ము దిద్దెడు ననుగుణము
పావనత్వము గలిగెడు భద్రవిద్య
సృష్టి కున్నతిం గూర్చు సుశ్రీవిభవము. 89

---

* మధురకవి నాళము కృష్ణారావుగారి రచన

• స్వకీయ రచన

ఊహాపోహల నుడుపు సమ్మోహశక్తి
ధర్మబలమున్ జయించు సౌందర్యరేఖ
జ్ఞానగరిమను మించు నానందముద్ర
ప్రణయదేవతా మహిమమ్ము ప్రబలతరము. 90

ప్రేమరసమున జాల్వారు పృథివి యెల్ల
ప్రేమవిభుడైన భగవాను ప్రీతి పాటి
ప్రణయతత్త్వము తెలియంగ బలికినట్టి
తత్త్వవేత్తల భావమ్ము తలపు గొనుము. 91

ఉర్వి సకలంబు ప్రేమమ్ము నుజ్జగించి
సంతసం బందు గాకేమి చాతకమ్ము
స్వాతిబిందుమరంద సంప్రీతి విడక
అనయ మాహ్వాన మొనరించు నంబుధరుని. 92

ప్రణయ సంభృతస్వాంతయై పరభృతమ్ము
సకలవాంఛలు మదిలోనె సందడింప
మూగ గొంతున రాగమ్ము మూటగట్టి
సలుపు వత్సరతపమ్ము వసంతు కొఱకు. 93

ఎంచ మీలకు జలముపై నెంత వలపొ
జలవియోగమ్ము ప్రాప్తింప క్షణము నంచె
ఉసురులను వీడు విరహమ్ము నోర్వలేక
అదియ జీవన ప్రణయమహత్వ మవని. 94

---

స్వకీయ రచన

విసమె మెసవును అనురక్తి విసపు పురుగు!
నిప్పునే ప్రేమ తినుగాదె నిప్పుకోడి!
సరసమధురపదార్థ సంచయము విడి;
వింత వింత తీరులు ప్రేమ విషము లివియు. 95

ఎన్ని యుగముల నిటు నిరీక్షించు నొకడ
తెప్పలల్లార్చి వినువీధి నప్పళించి
ముగ్ధ, తరుణిచకోరిక మోహవశత,
ఆత్మవిభు చంద్రుదర్శనం బానచేసి. 96

అవుర! మధుపాయి! ఎంతవాడవుర నీవు!
పద్మినీసద్మమున చెరబడితి కోరి;
పిక దృఢ దారువుల నలవోక తొలచి
దారి యొనరించు స్వేచ్ఛానుసారి వయ్యు. 97

స్థిరతర ప్రేమభావపచేళిమమున
వ్యక్తి గుణ పృథగ్ధర్మ ప్రసక్తి యుడిగి
ఐక్యతత్త్వంబె భాసించు నక్కజముగ
పసుపు సున్నాన పారాణి పొసగినట్లు. 98

• మించు చెలికాని కెడయీ వలచితేని
ధనము లిడికాదు, విలువయౌ మణులగాదు
ప్రేమసంపద దొల్కాడు హృదయ మొసగి
కూర్మి మిత్రుని మది చూర గొనగ దగును. 99

---

• స్వకీయ రచన

కష్టమయ జీవితాంబుధి గడుపు నౌక
ప్రేమయేగాక వేరొండు పృథివి గలదె
వైర భావమ్ముతో నెట్టి ప్రబలురైన
కడగి సాధించిరే పనుల్ గతచరిత్ర? 100

చదివి చదివి గ్రంథమ్ములు జగతి విసిగె
పండితు డొకండు గానంగ బడడు నేడు
ప్రేమ యను నక్షరమ్ములు రెండు నేర్వ
కెవడు పండిత సత్తముండవును పృథివి? 101

• ప్రణయ ధర్మమ్ము జగతి కాప్యాయనమ్ము
అఖిలధర్మార్థకామ నియంత యగుట
సృష్టిధర్మ నిర్వహణప్రకృష్ట మగుచు
ప్రాణికోటి సదానంద పద్మముజేర్చు. 102

కోట్లు పడగెత్తి ధనమును కూడబెట్టి
ఏమి గడువంగ గలిరి ప్రేమలేక
ప్రేమ సంపత్కుబేరు, గోవిందు గొలిచి
ఆపదలను తరింపుడో యఖిలజనులు. 103

మధుర కవి యైన కృష్ణరాణ్మహితునకును
వరసుశీలాంబకును గూర్చు పట్టియౌచు
లలి హయగ్రీవు నర్ధాంగలక్ష్మియైన
ఆంధ్ర భారతి లక్ష్మీకాంతమ్మ వ్రాసె. 104

ఓం తత్సత్

మంగళం భూయాత్

---

• స్వకీయ రచన